# భూదాన యజ్ఞం

(బుర్రకథ)

[illegible] ముసునూరాయ భాస్కర్రావు.

ద్వితీయ ముద్రణ
ప్రతులు 5000
డిశెంబరు 1955

వెల 0-2-0

ప్రకాశకులు
ఆంధ్రరాష్ట్ర నిర్మాణ కార్యకర్తల సంఘం,
సాహిత్య విభాగం ఏలూరు.

# ప్రస్తావన.

బుర్రకథ పఠనగ్రంథంగా కంటె ప్రచారసాధనంగానే యెక్కువ ప్రయోజనకారి. కథ భక్తిమీద చెప్పగా వింటు న్నప్పుడు మనకు కలిగే ఆనందం పుస్తక పఠనంవలన లభించదు. కనుక రచయిత ప్రధానంగా కథకుని దృష్టిలో బెట్టుకొనే యిది వ్రాయవలసివచ్చింది. కథకుని దృష్టి లో బెట్టుకోవటమంటే జనబాహుళ్యమును దృష్టిలో బెట్టుకొనటమే. ఎక్కువమంది ప్రజలలో భూదానోద్యమ భావప్రచారం తన రచనద్వారా కంటే అత్యధికంగా కథకునిద్వారా జరుగగలదని రచయిత ఉద్దే శం. కథ యీడికమైనకొలది కథకుడు దానిని యేమధ్యలోనో అసంపూర్ణంగా ముగించవలసి వస్తుంది. కనుక కథను సంక్షిప్త పరచటం జరిగింది. సాధారణంగా ఉద్యమాలకు ఒక క్రమగతి ఉంటుంది కాని కథాసరళి ఉండదు. అందుచేత యీవిధమైన కథల రక్తి రచయితపైకంటె కథకునిపైనే యెక్కువగా ఆధార పడియుండగలదుకూడా.

ఇప్పటికి యీ ఉద్యమం ఆరంభమై నాలుగేండ్లు గడచి 5 వ యేడు నడుస్తున్నది. 1951 ఏప్రిలి 18వ తేదీన తెలం గాణాలోని పోచనపల్లిలో రామచంద్రారెడ్డి అను ఉదారుడు వినోబాజీ అభ్యర్థనను పురస్కరించుకొని ఐచ్ఛికంగా 100 ఎ॥ భూమి దానంచేశాడు. మానవ హృదయంలో 'మంచి' ఉన్నదని, కొన్ని కారణాలచేత అది అడుగున బడవచ్చునని, వినయంతో ప్రేమతో నచ్చచెప్పితే అది తప్పనిసరిగా మారు తుందని, యిదే యీసంఘటనయొక్క సంకేతమని వినోబాజీ గుర్తించారు. అంతటనుండి హింసాక్షుభితమైన తెలంగాణా

శాంతియాత్ర భూదాన పదయాత్రగా, అపార వ్యాపకశీలంగల ఒక మహా ఉద్యమంగా రూపొందింది. ఇంతలో ప్లానింగ్ కమీషన్ పిలుపు వచ్చింది. కాలినడకన భూదాన ప్రచారం చేస్తూ ఆయన మధ్య ప్రదేశ్, వింధ్య ప్రదేశ్, రాజస్థాన్, ఉత్తర ప్రదేశ్ భూములుదాటి 1951 నవంబరు 13 వ తేదీకి ఢిల్లీ చేరుకున్నారు. 13 రోజులు అనంతరం తిరిగి ఢిల్లీనుండి ఉత్తరప్రదేశ్ లో పదయాత్ర ప్రారంభించారు. 1952ఏప్రిల్ లో కాశీ సమీపమునందలి సేవాపురి కుగ్రామంలో చతుర్థ సర్వోదయ సమ్మేళనం జరిగింది. భూదానోద్యమం ఆరంభమైన తరువాత జరిగిన మొదటిసమ్మేళనం యిదే. అప్పటికి దేశంమొత్తంలో లక్ష ఎ॥లకు పైగా భూమిదానం లభ్యపడింది. 1954 నాటికి అనగా రెండేండ్లలో దేశం మొత్తంమీద 25 లక్షల ఎ॥ల భూమిదానం సేకరించాలనే శుభసంకల్పం యిక్కడ గైకొనబడింది. దేశంలోని 5 లక్షల పల్లెలలో కనీసం గ్రామానికొక సర్వోదయ కుటుంబమైనా యీరెండేండ్లలో యేర్పడాలని యీ దీక్ష ఉద్దేశ్యం.

1952 సెప్టెంబరులో వినోబాజీ బీహారులో ప్రవేశించారు. 1953 చాండిల్ (బీహారు)సమ్మేళనంనాటికి దాదాపు 11 లక్షల ఎ॥ల దానం లభించింది. 1954 అంతంవరకు ఆయన యాత్ర ప్రధానంగా బీహారులోనే కేంద్రీకరింపబడింది. 1954 ఏప్రిల్ గయాసమ్మేళనంనాటికి దేశంమొత్తంలో భూమిదానం 32 లక్షల ఎకరములయినది. అనగా సేవాపురి లక్ష్యమునకు మించి 7 లక్షల ఎకరములు అదనంగా లభ్యపడింది. దీనిని

బట్టి దేశంలోని పార్టీలు, సంస్థలు, ప్రజలు యీ ఉద్యమంపై యెక్కువ శ్రద్ధ చూపుతున్నట్లు స్పష్టపడింది. భూమిదానంతోపాటు సంపద, శ్రమ, బుద్ధి జీవనదానములుకూడ మొదలై ఉద్యమవ్యాపక శక్తి మరింత విస్తృతమైంది. 1955 జనవరి ఆఖరువారంలో వినోబాజీ ఒరిస్సాలో ప్రవేశించారు. 1955 సమ్మేళనం పూరీజగన్నాథం (ఒరిస్సా) లో జరిగింది. 1957 లోగా దేశంమొత్తంలో 5 కోట్ల ఎకరముల భూమిదానం సేకరించి భూక్రాంతిని సాధించాలని యీసమ్మేళనం దేశానికి పిలుపునిచ్చింది. 1955 ఆగష్టుఅంతానికి ఒరిస్సాలో షుమారు 400 గ్రామదానాలు లభించినవి. బాపూజీ ఆశించిన గ్రామరాజ్య లక్ష్యం సుదూరంకాక, అతిదాపులోమనకు ప్రత్యక్షంగా కనపడుతున్నది అక్టోబరు 1వ తేదీనుండి వినోబాజీ ఆంధ్రయాత్ర ప్రారంభం. తెలుగుదేశంలో పుట్టిన భూదానోద్యమం తెలుగుదేశంలోనే పరిపూర్ణ ఫలసిద్ధిని పొందాలని ఆయన సందేశం. త్యాగార్జితమైన నూతనరాష్ట్రం యీదీక్షలో వెనుకబడుతుందా ?

రచయిత :

ఓం.

# భూదాన బుర్రకథ



## రగడ

అంబరచుంబి హిమాచల శిఖరకిరీట భారతాంబ
సువిశాలంబగు భూఖండం బతి సుందరనందనము
భువనమోహనము సస్యశ్యామల అవనికె భూషణము
పసిపాపలవలె పైరుల బెంచి బంగరుపండించి
పొసగ ప్రకృతికి వింత సొబగులను పూరించెడి రైతు
నగములు లోయలు మిట్టలు దాటి యెగిరి దుముకునదులు
తనివి దీరదీ త్యాగతృష్ణకూ తారకాణ కాగా
బుద్ధ శంకరులు శివాజి గాంధీ ముఖ్యులు పుత్రికులు
దిద్దిన బంగరు బాటలు ప్రగతికి సిద్ధాంజనములుగా
అఖిలకళల కాచార్యపీఠి దివ్యాశయముల పేటి
కర్మక్షేత్రము ధర్మక్షేత్రము జ్ఞానతపోవాటి

వ॥ అట్టి యీ పవిత్రభారత భూమిం దక్షిణభాగంబున నైజాంస్టేటు కలదు. అందు తెలుగు కర్నాట మహారాష్ట్ర భాషా విభాగంబులు గలవు. తెలుగు విభాగము తెలంగాణ యనబడు. అందలి ఏడుజిల్లాలలో నల్లగొండ యొకటి.

## ర గ డ

కూడు గుడ్డలకు మోమువాసినా కూలిజనులతో
నిలువనీడకైనా నోచని కడు నిరుపేదలతోడ
కనుల భాష్పములు గార్చెడి కాపుల కష్టకథలతోడ
కనుల ముందుగల నరకంబిదియో గాబోలనిపించు
భళానోయిభాయ్ తమ్ముడా – సై – భాయిభళా
నోయ్ దానానా॥

పెద్దపెద్ద జాగీర్లవి
కొద్దిమందికే యున్నవి
భూమిలేని నిరుపేదలు
శ్రీమంతుల కరిగాపులూ
లేమికంత కధికారులూ
భూమిదున్ని పండింతురూ
యేమి లాభమూ సంపదా
భూస్వామికే యర్పించాలి॥ భ॥
బండచాకిరీ తప్పక
పండిన పంటకు నోచక
దురదృష్ట విధి దూరుచు
తమకోపాయము గానక
అశ్రు పూర్ణ నేత్రాలతో
ఆర్తికంకితంబైనారూ॥



## రగడ

పరపాలన మిదితొలగి కాంగ్రెసూ పరిపాలనమున్నా
ఒరిగినదేమిటి పట్టణంబులే పెరుగుచుండెగాని
గాంధిమహాత్ముని కలలుగన్న యాగ్రామ స్వారాజ్యంబు
స్వయంపోషకంబై వర్ధిల్లిన పల్లెజీవనంబు
ప్రతిగృహంబును రాట్నలక్ష్మి పెంపారిన సుదినంబు
కంటికి దూరముకాగా ప్రజలకు కంటనీరు మిగిలె
ఉంటకు తింటకు గతిలేదాయె పంటకాపుకయ్యో॥

వ॥ అసంతృప్తితో ఆందోళన పడుతూ యాతనాభరమైన కష్టజీవితము గడుపుతున్న ఆ పేదప్రజల దుస్థితిని ప్రభుత్వోదాసీన్యతను అవకాశము జేసికొని కొందరు హింసావాదులు పేదల నుద్దేశించి యేమంటున్నారంటే

## రగడ

బక్కచిక్కినా రైతన్నా నీకెక్కడిది మోక్షంబు
అక్కటకట పండించిన పంటకు హక్కునీకు లేదు
నీ చెమ్మటలో తడిసిన భూమి నీది గాదయేమి?
నీచమైన యీదుర్భర జీవిత నియతి యెన్నినాళ్ళు
నీరక్తమె గద జాగీర్దారుల నిరుపమ సంపదలు
ఆరయ ధర్మము దున్నువానిదే హక్కు భూమిపైనా
సాగింపగదో హింసావిప్లవ సమరంబన్నారు
బాగోగు లెరుంగ కమాయికులా ప్రజలదివిన్నారు

[illegible]

ఘాకవచ్చి నిరాశ్రయుల [illegible]
[illegible] సామ్రాజ్యముగా [illegible]
స్త్రీలూ పురుషులు ఘాతకుల చేతులు
చిత్రహింసలకు గురియైపోయిరి
హత్యశేషులు ప్రాణభీతివడి
ప్రాణికియున్న బలుసాకు తింటూ
తల్లిబిడ్డలు వేరై [illegible]నారు

వ॥ ప్రభుత్వమంతట శాంతిస్థాపనకై సైనికుల పంపినది. పేదలాక్రమించిన భూములు మరల భూస్వాముల స్వాధీన మొనర్చబడినవి. పాపము పేదల యాశలు నిరాశలైనవి.

రగడ

పౌనారునను స్పట్టి వినోబా ప్రార్థించిదివించు
దారుణ హత్యాకాండ కెంతయో దందడి మదిగొంచు
యీపవాదమున కంతను కారణమేమో యనుకొంచు
దేవదూతయై యటకేతెంచే దీనశరణ్యుండు
పాదచారియై ఒక్కటొకటిగా పల్లెపల్లెదిరిగి
ఆదరభావముతోడ నహింసాబోధామృత మొలికి
కూడులేని నిరుపేదలజూచీ కుమిలిపోయినాడు
నీడలేని యతి దీనులగని కన్నీరుగార్చినాడు
గ్రామగ్రామమున వందలప్రజలూ బ్రహ్మరథముబట్టి
ఆమహాత్ము ప్రేమాతిశయముతో నాహ్వానించారు॥

వ॥ ఒక్కనాడా మహానీయుం[illegible] పల్లెపట్టున సభికుల నుద్దేశించి,

రగడ

సదయులైన ఓసభికులార ఓ శాంతిప్రియులారా !
ఏదిమార్గంబీ ఘోరవిపత్తుం దుదముట్టించుటకు
సామరస్య సంపాదనకేది సవ్యమైన దారి ?
అనిమహానీయుడు ప్రశ్నింపగనే ఆసభలో నపుడు
పౌరుడొక్కరుడు వెంటనె లేచి బాబా మహానీయా !
ఆరుగాలమును శ్రమపడినా కన్నీరే మిగిలేది
పంటపండినా కడుపునిండనీ పాడు బ్రతుకుమాది
పండించుకొనను కొందర యిప్పించండి బ్రతుకగలము
శక్తియున్నదీ కాయంబందున శ్రమపడగా మాకు
ముక్తికి మార్గంబిదెయొకటే మాకార్తి బాపవయ్యా
భళానోయ్ భాయి తమ్ముడా భాయి భళానోయ్ దాదాన॥

వింటిరటయ్యా సభికులు
పేదరైతు విజ్ఞాపనా
ఏముత్తరగ మీనేర్తురా
ఆమానిసి నుడి విన్నారా॥
భూమి గల్గు భూస్వాములు
లేమిజిక్కి నిరుపేదలు
సామరస్యమున బ్రతుకగా
భూమిదానమే మార్గంబూ॥

ఘర్షణలేని క్రాంతికి
హర్ష పూర్ణమహా శాంతికి
త్యాగమెగాదా మార్గము
బాగోగులు గమనించండీ॥

రగడ

అనుచు వినోబా సభాభిముఖుడై వినుచుండె తదన్యగను
వెనువెంటనె భూస్వామియైన యొక ధనికుడు తా లేచి
నేనిచ్చితి నొక నూరెకరంబుల దానమంచు నవికే
శాంతివిప్లవ క్రాంతి బీజమీ చందంబై వెలసె

తందాన

దీర్ఘదర్శి యా తేజస్వంతుడు
జ్ఞానమూర్తి విజ్ఞాన సాగరుడు
దేశవ్యాప్త మహోద్యమంబుగా
దీనిరూపమును దిద్దదలంచి
భూదానోద్యమ భూరితపస్సు
పాదచారియై కొనసాగించుచు పయనంబైనాడు॥
ఆత్మజులందొక ఆత్మజుడంచు
ఆరవ వంతు భూమిదానము
భూమిలేని నిరుపేదల కొరకై
ప్రేమతోడ నాకివ్వండీ యని
ధనిక దరిద్ర విభేదము లేక
జనపదముల నిల్లిల్లు దిరిగె నాసంయమివర్యుండు॥

## రగడ

శ్రీకర శుభకర శ్రేయోరాజ్య క్షేమంకరులార ?
త్యాగులార భూదానం నలుపుని భాగునకు నిదానం
భాగమిందు మీపుత్రుల నొకనిగ భావించియు సన్న
వెలుగూ గాలి అందరి సంపద తెలియ రేమి మీరు
యిలగల భూమికి యితర సంపదల కెలమిని మీరంతా
ధర్మకర్తలని లోదలచండీ ధర్మబుద్ధులారా !
మర్మ రహితమగు ధర్మంబిది మీమంచి నిలుపుకోండి !
శాంతిదూతయగు గాంధిమహాత్ముడు జన్మించినభూమి
శాంతి కారుడగు బుద్ధ దేవుని కరుణామయధాత్రి
కన్న బిడ్డలగు అందరి పైజనొక కంటజూడ దేమి?
కన్నిరు ద్చే శ్రమజీవులు మీయన్న దమ్ములేగా
ఉన్నభూమిలో ఆరవభాగంబొసగి మేలుగనుడు
ఎన్నదగ్గ ఘనశాంతివిప్లవంబిది యోసని వినుడు॥

## గేయం.

ఓ దూరదర్శి దొడ్డ కాపా
బక్కరైతూ గోడు విన్నావా – నీ
పాలి ధర్మంబేమొ గన్నావా॥
మట్టిలో మాణిక్యరాసులు
పట్టితీసే జెట్టి కయ్యో
కష్టపడినా కడుపునిండని
కర్మమేమో గానకున్నావా॥

నేలదున్ని పైర్పపత్తి
నీరుపెట్టి పైరుబెంచి
పంటనీగా చెలకు జేర్చి
పరమ మిత్రుండెనుగకున్నావా॥

పొలమునీది కలిమినీది
అరక గట్టి హలము బట్టి
పొలము దున్నే భూమి లేదు
పొలము లేదన మిన్నకున్నావా॥

'మేనికండలు చెండియిచ్చిన
దానశీలురగన్న భూమి
భాస్కరాదుల దానధారా
పావనంబనుమాట విన్నావా॥

అగ్ని పర్వాత శిఖరమందీ
వధివసించిన లేదుశాంతి
పదుగురకు మేలున్న నీకును
యొదవు మేలిదియెరుగకున్నావా॥

## రగడ

శ్రీకరశుభకర శ్రేయోరాజ్యం క్షేమంకరధీరా !
శోకములేని అశోక ధర్మముం స్మరింప మేల్కొనరా !
ఈవిధంబుగా సంస్థానములో భావే బోధించే
యావికి కొదువా యేమి త్యాగమున కీధర నుతిగాంచె

ధనికులు నిర్ధను లుదాసులై భూదాన మొసగినారు
మనమున నెంతో భావే మహిమం గొనియాడిరివారు
అవతరించెరా మహాత్ముడితండవని నుద్ధరింప
భువన రక్షకై స్వార్థమలీమసమును ప్రక్షాళింప
పరపీడనకును స్వస్తి బల్కి ఆపన్నుల రక్షింప
పరతెంచిన మనపాలి దైవమని ప్రస్తుతించినారు
భళానోయ్ భాయి తమ్ముడా-సై-భాయిభళానోయ్ దాదానా

"పల్లె పల్లెకూ దిరుగుచు
ఎల్లరి నుద్బోధించుచు
మనసులెల్ల ద్రవియింపగా
ఘనుడు వినోబా వ్రాకుచ్చె॥

"నేనని నేనని దాతలు
దాన పత్రములు వ్రాసిరి
జ్ఞాని వినోబాకిచ్చిరి
మానసంబు లుప్పొంగంగా॥

"నెత్తుట దడిసిన భూమిలో
నిలువని విప్లవబీజము
మెత్తని హృదయములందహో
విత్తగానె మొలకెత్తిందీ॥

వ॥ 1951 ఏప్రిల్ 18వ తేదీ పోచనపల్లె గ్రామంలో యీ ఉద్యమం ఆరంభమైంది. నల్లగొండ వరంగల్లు జిల్లాలలో

పల్లెపల్లెకు భూదానసందేశం అందిస్తూ, భూదానం గ్రహిస్తూ వినోబాజీ జూన్ 14వ తేదీకి హైదరాబాదు సరిహద్దుదాటి మధ్యప్రదేశ్ లోని పౌనారుఆశ్రమం చేరుకొన్నారు. అంతలో ఢిల్లీనుండి వర్తమానం వచ్చింది.

పంచవర్ష పథకంబు చర్చలో
ప్రాగ్గాన ఢిల్లీ రాగోరుచు తా
పంచె ప్రధానామాత్యుడు నెహ్రూ
భావే పూజ్యున కాహ్వానంబు

భూదానోద్యమ భూరిభారము
భుజస్కంధముల నున్నదిగాన
పాదచారినై రాష్ట్రరాష్ట్రముల
పర్యటించుచును వచ్చెదనంచు
ప్రధాన మంత్రికి ప్రత్యుత్తరమును
పంపించాడాచార్య వినోబా॥

## రగడ

మార్గమధ్యమున పల్లెపల్లెలో మకాముచేయుచును
నిర్గతశోకము గ్రామరాజ్య మపవర్గ సంఘమంచు
జనహృదయంబులు కరగిపోవనా సంయమిబోధించె
దానభూమి వేలెకరంబులుగా నానారాష్ట్రముల
కరినగరంబును జేరుకొనియె నాపరమ తపోధనుడు

వ॥ ఈ విధముగా 51 రోజులపాటు 1800 మైళ్ళు కాలినడకన యాత్ర సాగించుకొంటూ వినోబా జీ మధ్యప్రదేశ్, వింధ్యప్రదేశ్, రాజాస్థాన్, ఉత్తరప్రదేశ్ భూముల నధిగమించి 1951 నవంబరు 13వ తేదీకి ఢిల్లీచేరి యమునా తటమునగల మహాత్ముని సమాధిప్రక్కన ఒక చిన్న పటకుటీరంలో కొలువున్నారు. ఈ ఉద్యమం ప్రారంభమై ఆనాటికి 6 నెలలు. లభించిన దానం 35 వేల ఎకరాలు.

రాజేంద్రుడు నెహ్రూ మున్నగు ఘనరాజ్యవేత్తలంతా
వేజను దెంచిరి పూజ్యవినోబా విడదికగు నె వింత
పంచవర్ష పథకంబును గూర్చి ప్రసంగించినాడు
ఎంచనిదియె దేశాభివృద్ధి కాస్పదమని యన్నారు
పథకమంతయు ఆద్యంతంబుగ పరిశీలన జేసి
ఇదికడు దేశానర్థక మంచూ పెదవివిరచినాడు
పల్లెసీమలను భారీయంత్రము భాహాటముగాను
కొల్లగొట్టకొను పథకంబిది సంకుచిత మనుచితమ్ము
చెల్లరె! పల్లెల స్వాతంత్ర్యంబీ ఢిల్లీపాలేనా?
వ్యవసాయమెగా ప్రధానవృత్తి భరతావనిలోన
అవురౌరా యిట కూటికి లోపం బాశ్చర్యముగాదా?
తిండికొరతయని యెగుమతులేలా దేశాంతరములకు?
కొండనాలుకకు జూచిన మాడు ఉండనాల్కకూడ
డాలర్లకుగా మీకీ తహతహ తగదూ తగదయ్యా!
మరచిపోతిరా మన మహాత్ముని మహోపదేశంబు
పల్లెపల్లె యిల్లిల్లు వృత్తులతో భాసించిననాడు

కోట్లగాదె ఉత్పత్తి అరువది కోట్ల కడుపులారా !
జనమల్పంబగు భూమికి యంత్రము పనికి వచ్చుగాని
జనము పారమగు యీ దేశంబున పనికే యంత్రంబు ?

వ॥ ఇంటింటా గ్రామగ్రామంలో (గ్రామోద్యోగ పరిశ్ర)మలను స్థాపించి ప్రతిగ్రామం స్వయంపోషకం, స్వయంపాలకం, స్వావలంబకం అయ్యేటట్టు చూడటం ప్రభుత్వవిధి. ప్రజలకు యీవిధమైన స్వాతంత్ర్యం ఉన్నప్పుడే ఢిల్లీనుంచి — స్వరాజ్యమునకు సార్థకత, అన్నారు వినోబాజీ. ఢిల్లీలో 12 దినములుండి మళ్లీ ఉత్తరప్రదేశ్ లో పదయాత్ర ప్రారంభించారు.

కథలు గాథలై ఉద్యమ మంతట హృదయము లూగించె
పేదలు, ధనికులు, లుబ్ధులు, దాతలు భూదానంబిడరి
మానవహృదయము నచ్చజెప్పగా మారదనెడి వాదు
లేని పోని దొక యూహామాత్రమే గాని నిజముగాదు

వ॥ అను యీ యదార్థమును యాత్రలో అనేక సంఘటనలు రుజువు జేసినవి. ఒక నాడు ఒక గ్రామంలో గ్రామ భూదాన సమావేశం జరిగింది. సభలో యెవ్వరూ భూమి యివ్వటానికి సిద్ధపడ లేదు. అత్తరి

రగడ

తా జన్మలో ఒక కాసు నొరులకు దానమివ్వ నతడు
పూజకైన నొక ఆకు తోటలో ముట్టనీని వాడు
ఆలి జుట్టునే గొరిగినఘనుడు తైలము ఖర్చించూ

తాలు చెప్పు పాతేళ్ళను కొలుచును కులిం దర్గించు
అట్టి కటిన స్వార్థయుండు సభాంతరగ నుండు లేచి నిలచి
నట్టిన దానము రెండు బీగములు నేనిచ్చితిననగా
కష్టమటంగల జనసమూహా మొక్కుమొగి చకితమాయె॥

వ॥ సురిగాంకచా

తం ధా నా

రామచరణుడను ముదుసలి గుడ్డి
భూమిదాన విషయంబు నెరింగి
చీకటిసడగా చేతికర్రతో
స్నేహితునొక్కని బాసటగొంచు
ఆరుమైళ్ళ దూరంబు కాలినడ
నరుగుచెంచెను భావే విడిదికి
అర్థరాత్రి సమయంబున నందరు నాదమరచియుండ!
కార్యకర్త యొక డాసమయంబున
కన్నువిప్పి యమ్ముదుకని జూచి
పని యేమనగా నందువృద్ధుడు
యెవరో బాబా యిటనున్నాడట
భూమిదానమును గైకొంటాడట
నాకు గలదు పదిరెండు బీగములు
నాణ్యమైన సుక్షేత్రము బాబూ
దానమిచ్చి పోవచ్చితినదియా
దీనబాంధవుడు బాబాకనుచుం
దెలిపె వినయనుతుడై

వ॥ కార్యకర్త వెంటనే దానపత్రమును పూర్తిచేసి రామశరణునిచేత వ్రేలిముద్ర వేయించినారు. రామశరణు డంతట గృహోన్ముఖుడైనాడు. ఉదయం బాబా యిదివిని

రగడ

రామునిపాదము లిటు విచ్చేసెను రామశరణుసేన
ఈమఖమున కిటు లాశీర్వాదంబిచ్చె నాప్రభుండు
శుద్ధియగునె ఆరామశరణుడు శుద్ధి మనముగాక
శుద్ధిదేమి ఆదాత్మ హృదయము శుద్ధివి కసన్నైనా॥

వ॥ అని ప్రస్తుతించినారు. 1952 ఏప్రిల్ నాటికి ఆయన కాశీ చేరుకున్నాడు. 1952 ఏప్రిల్ 13, 14, 15, 16 తేదీలలో కాశీవద్దగల సేవాపురి కుగ్రామంలో చతుర్థ సర్వోదయ సమ్మేళనం జరిగింది. భూదానోద్యమం ప్రారంభమైన తర్వాత జరిగిన మొదటి సమ్మేళనం యిదే. అప్పటికి దేశంమొత్తంలో లక్ష ఎకరాలకుపైగా భూదానం లభ్యమైంది. దాతలసంఖ్య షుమారు 5 వేలు.

సేవాపురి సమ్మేళనలో సర్వసేవాసంఘం యీ క్రింది తీర్మానము గావించినది.

భళానోయ్ భాయితమ్ముడా–సై–భాయిభళానోయ్ దాదానా
గ్రామము లైదూలక్షలు కలవీ దేశంబందున
పాలము లేని గ్రామీణులే
తెలియ నైదుకోట్లున్నారూ ॥భ॥

జలము గాలి వెలుగేగతి
నలువురి హక్కైయున్నదో
పొలము సర్వమానవులకే
యిల సమిష్టిసౌభాగ్యంబూ॥

భూస్వావస్థ సరిదిద్దగా
భూమిదానమే శరణము
శాంతివిప్లవమె మార్గము
క్రాంతి అహింసా గమ్యంబూ॥

యిరువది యైదులక్షలు
ఎకరాలైనా భూమినీ
సేకరింప రెండేండ్లలో
దూకాలి కార్యరంగానా॥

వ॥ సర్వసేవాసంఘ తీర్మానానంతరము యు.పి. నుండి బీహారులో ప్రవేశించి

## ర గ డ

భూదానోద్యమ దివ్యశంఖమును పూరించుచు భావే
పాదచారియై బీహారులోనా పర్యటించసాగె
కరుడుగట్టినా జనహృదయంబులు కరగె నతనిబోధ
స్థిరమగు మార్పునకిది యొక్కటియే శరణమనుచుగాదా
దానపత్రములు పేదలు ధనికులు తపనకొసగినారు
దీనశరణ్యుని చేతవేయుని లోకోన పొంగినారు

పల్లెపల్లెయూ తీర్థంబైనది భావేపదస్పర్శా
తల్లిభారతి ఆనందాశ్రులె దానధారకాగా
ఈవిధంబుగా చాందిలు వరకు యే తెంచియు భావే
లావు రుజకు లోనై నీరసమున లేవలేని వాడై
చాందిలునందే విశ్రాంతింగొన సముచితమని యెంచె

వ॥ 1953 మార్చి 7, 8, 9 తేదీలలో చాందిలులో నే పంచమ సర్వోదయ సమ్మేళనం జరిగింది. అప్పటికి దేశం మొత్తంమీద 11½ లక్షల ఎకరాలు భూమి దానం లభించింది. ఈ సమ్మేళనం కార్యకర్తలలో నూతనోత్సాహం పూరించింది. చాందిలునుండి బీహారు భూదానయాత్రలో నూతన ఘట్టం ఆరంభమైంది.

రగడ

మందస్మిత వదనారవిందుడూ సుందరవిగ్రహుడు
ధీరచిత్తుడూ దేశసేవనా పౌరుషగుణధనుడు
అరితేరు ఘనవామపక్ష నాయకుల నగ్రసరుడు
భావే యుద్యమ ముజ్వల క్రాంతికి జీవగఱ్ఱయంచు
భావించి జయప్రకాశ యమ్మునివర్య శిష్యుడాయె
భారతపితకూ నెహ్రూజీ యెటువారసుడైనాడో
ఆరీతి వినోబాజీ వారసుడగునో యితడనగా

తంధాన

సాధు వినోబా భూదానోద్యమ
సాఫల్యమునకు సాయపడుడని

కాంగ్రెసు శాసన సభ్యజనులకు
ప్రదేశ కాంగ్రెసు సదస్యులకును
ప్రజాకోటికిని ప్రార్థనజేస్తూ
తీర్మానించెను బిహారు కాంగ్రెసు దీక్షామధురముగా॥

వ॥ 1954 మార్చిలో బుద్ధగయలో సర్వోదయ సమ్మేళనము జరిగినది.

రగడ

గయసర్వోదయ సమావేశము కనులపండువండి
జయప్రకాశ వినోబాపండితజవ్హారు కృపలానీ
అధ్యక్షుడు రాజేంద్రుడాది ఘనులందరికోసండి
ఆద్యంతములు లేని జనోదధి అవనిబట్టకుండె
బుద్ధంశరణంగచ్ఛామీయనె బోధిసత్వుడిటనే
సంఘం శరణంగచ్ఛామీయనె శాక్యమునీ యిటనె
ధర్మంశరణం గచ్ఛామీయనె తపసిబుద్ధుడిట నె
చంపూ సత్యాగ్రహము బాపూజీ సాగించిన దట నె
అద్వైత గురుండైన శంకరాచార్యు గురుకులమ్మో
ఆదిలక్ష్మి భూజాతమాత సీతమ్మపుట్టినిల్లు
గయవేదికపై అఖిలనాయకుల కంఠము లొక్కటిగా
జయతు అహింసాపరమోధర్మః జయతని శబ్దించె
జయప్రకాశ విజ్ఞప్తినందుకొని సాధువినోబాజీ
జయాస్తటంచు జీవనదానము పలికె తపోరాసి
వందలాదిగా సేవాసక్తులు ముందునకే తెంచి
జీవనదాన మహాయజ్ఞంబున చేరిరైచ్ఛికముగా

వ॥ గయ సమావేశంతరువాత వినోబాజీ జనవరి 26 వ తేదీన ఒరిస్సాలో ప్రవేశించారు. ఆనాటికి భూదాన భావ ప్రచారం దేశం నలుమూలలకు వ్యాపించింది. జాతీయోద్యమం నాటి మహాత్ముని గ్రామరాజ్యసందేశం దీనిఫలితంగా తిరిగి ప్రజల ఆలోచనాపరిధిలో ప్రవేశించింది.

## రగడ

గ్రామరాజ్య సందేశమువినుచును కర్మయోగి భావే
గ్రామ గ్రామముంగడచి ఒరిస్సా సీమంజేరక నే
దీక్షానిరతులు కార్యకర్తలక్షయ సేవానిధులు
తొంబదియెనిమిది గ్రామదానములు తొలికానుకగా సం
కుంభధారగా దానవర్షమారంభంబై కురిసె
పల్లెపల్లెలో వేనవేలప్రజ ప్రార్థన కేతెంచి
ఉల్లమలర భావేసందేశము తెల్లముగా వినిరి
యెల్లయెడల భూదానచర్చలే పల్లెపల్లెలోను
ఎందుజూచినా భూదానోద్యమ గ్రంథపఠనమౌను
వచ్చువాడు మనపల్లెకుభావే యిచ్చిస్వాగతంబు
యిచ్చుకొందము గ్రామదానమను ముచ్చటలేప్రబల
వాతావరణము నూతన జవసత్వములనిట్లునిండి
చేతోమోద మెలర్ప, జేరెనా దేవదూత పూరి

వ॥ 1955 లో పూరీ జగన్నాథమునందు సర్వోదయ సమ్మేళనము జరిగినది. దేశం నలుమూలలనుండి లక్ష

లాది జనులు సమావేశానికి విచ్చేశారు. సభావేదికనుంచి భావేవాణి–

తంధానా

"మానవహృదయము నచ్చజెప్పుచో
మారుననుట కీనాలుగేండ్లలో
భూదానోద్యమ ప్రగతి సాక్షియై
ఆదర్శంబుగ నిలచె ప్రపంచం బాశ్చర్యంపడగా॥

హింస వేగముగ విజృంభించెడి
యీయుగంబులో నహింస సైతము
శరవేగంబుగ సాగిపోనిచో
చరిత్ర వెనుకకుమరలదు మనకై
తరిలో ఉద్యమ గమనముకూడా పెరుగవలయుగాదా!

ప్రారంభక్రియ దానమనునది
ఆరనిదీక్షారంభులుగండు
భూమిక్రాంతి శపథంబుగైకొని
గ్రామ గ్రామమున ఉద్యమాశయము
గడపగడప కందింపగలెండో కార్యకర్తలారా॥

ఐదుకోట్ల ఎకరంబుల భూమి
ఐదులక్షల పల్లెలలోన
సేకరించి రెండేండ్ల గడువులో
భూక్రాంతిని సఫలంబొనర్చుటే పూరీలక్ష్యంబు॥

వ॥ అని వివరించారు. ఆసన్మోళిసతో ఉద్యమ జగన్నాథ రథముకదలింది. మిట్టపల్లము లేకము కొనొచ్చినవి. గ్రామదాన ముల సంఖ్య వందలలో బడినది. రాక పోక సౌకర్యములు లేని మన్యప్రాంతములకుకూడ కార్యకర్తలు వెళ్లి భూదాన ప్రబోధ మందించారు. ఒక్క కోరాపుట్టు జిల్లాలో షుమారు 200 లకు పైగా గ్రామదానములు లభించినవి. ఆగస్టు మాసారంభానికి ఒరిస్సాలో మొత్తం 400 గ్రామ దానాలకు పైగా లభించినవి. ఆగస్టు 7, 8, 9 తేదీలలో వినోబాజీ ఆంధ్ర ఒరిస్సా సరిహద్దు లోని రావికొన పార్వతీపురం మొదలైన పల్లెలలో యాత్ర సలిపి 10 వ తేదీ తిరిగి కోరాపుట్టుజిల్లాలో ప్రవేసించారు. ఈ మూడురోజుల యాత్రలో ఆంధ్ర ప్రజలకు ఆ సాధుసత్తముడు యీవిధమైన సందేశమిచ్చారు.

## తంధాన

వీరభూమి యీ ఆంధ్ర ధరిత్రి
పేరుగన్న దీ త్యాగ చరిత్రి
తెనుగులు విషయ విమర్శా నిధులు
మనసు నచ్చితే నిరాలస్యముగ
యెంతటి దుర్ఘట కార్యమైన సాధించు శక్తిపరులు

గిరిగహనంబుల పరువులు దోలి
వరగోదావరి కృష్ణా నదులు
జలము దెచ్చి బంగారపు పంటల
కలిమిఁగూర్చు యీ తెలుగు పొలములో

త్యాగము కాదువా ? భూదానోద్యమజని, –
యిది గంగోత్రి॥

వస్తులమెప్పుడు పుట్టిన చోటకె
వచ్చి పూర్తియగు టొప్పునుగాన
భూదానోద్యమ గంగోత్రి యిటన్
పూర్తి ఫలము సాధింతు మటంచు
తెలుగులార శపథంబు గైకొనుడు తిరుగనిదీక్ష॥

పల్లె పల్లెలో యీసందేశము
కొల్ల కొల్లగా వ్యాపించినచో
యిల్లిల్లును భూదాన తీర్థమై
వెల్లున తెన్నున దానపత్రములు
లక్షలగుచు, భూదానము కోట్లగు టాశ్చర్యంబేమి ?॥

భూమిదానమును సంపద్దానము
యేమనీషియును చేయనివాడు
తెలుగు భూమి నలుమూలలలోన
యెలమి మచ్చు కొకరుండు లేడని
తెలుపుడు–సంతత కార్యనిష్ట, దిగ్దేశంబులు మెచ్చ॥

వెలుగు గాలి జల మట్టిల భూమి,
కలిమి, బుద్ధి, శ్రమ నలువురి సొత్తని
లలిత మధుర ప్రేమామృత మొలుకగ
తెలియ జెప్పుడీ పల్లెపల్లెలో
నూతన రాష్ట్రము సర్వోదయ ప్రాభాత గీతి పలుక॥

ఐకమత్యమే భారత శక్తి
ఏకమైనచో మన హృదయంబులు
కాక యుండునే స్వర్గంబిదియే
ఏక లక్ష్యమున ఏకమనస్కత
శాసన శోషణ రహిత వ్యవస్థకు స్వాగత మీయరండు॥

వ॥ అని ఆ యుగపురుషుడు ఆంధ్ర ప్రజలకొక సందేశ మిచ్చారు.

తందాన

భూమిదానమును సంపద్దానము
బుద్ధిదానము జీవనదానము
భూదానోద్యమ వివిధాంగములై
ఆదర్శంబగు రామరాజ్యమే అవతరించుగాక

ఐదులక్షలా గ్రామంబులలో
ఐదుకోట్ల యెకరంబుల లక్ష్యము
ఐదుకోట్ల నిరుపేదల కన్నుల
ఖేదాశ్రులు తుడువంగ వినోబా బోధ సఫలమగుత॥

జనహృదయంబు లహింసావిప్లవ
జనితోత్సేకత పరివర్తితమై
జనజీవితమే మారి సమాజము
కనులవిందుగా నార్తిరహిత నందనవనమగుగాక

